# ముత్యాల కోకిల

(కవితా సంపుటి)



ఆంగ్లమూలం

శ్రీమతి సరోజినీ నాయుడు



అనుసృజనం

డా॥ సి. నారాయణరెడ్డి

# అవతారిక

డా॥ సి. నారాయణరెడ్డి

కోకిలది అవ్యక్త మధురధ్వని.
ఈ "ముత్యాల కోకిల"ది సువ్యక్త సముదాత్త రసావేశ స్వరధుని.
తలిదండ్రులది వంగదేశం.
తాను పుట్టిపెరిగింది హైందవ మహమ్మదీయ సంస్కృతుల
సంగమపురం భాగ్యనగరం.
వలచి చేపట్టింది తెలుగుబిడ్డణ్ని
డా॥ ముత్యాల గోవిందరాజులు నాయుణ్ని.
మోసులెత్తింది ఆంగ్లకవయిత్రిగా.
దేశం నాలుగు అంచుల్ని ఆవేశించింది దేశభక్తి కరదీపిక
వీర సవిత్రిగా.

తండ్రి అఘోర్‌నాథ్ ఛటోపాధ్యాయ విజ్ఞానశాస్త్ర జిజ్ఞాసువు.
వినూతన విషయ గవేషణ పిపాసువు.
తన కూతుర్ని గణితశాస్త్రనిపుణగానో
విజ్ఞానశాస్త్రవిదుషిగానో రూపొందించాలనుకున్నాడు.
కానీ కథ అడ్డంతిరిగింది.
సరోజిని తలలో లెక్కలకు బదులుగా
చుక్కల తోట మెరిసింది.
అది ఆమె పదకొండో యేటి సంఘటన.
ఆల్జీబ్రాలెక్క ముడి విప్పాలని చూస్తున్నది.
ససేమీ కుదరలేదు.
ఆ క్షణంలో ఉబికివచ్చింది ఆర్ద్రగీతం.
ఆ ముహూర్తాన జరిగింది ఆమె కవితకు అక్షరాభ్యాసం.
పదమూడో యేట పదమూడు వందల పంక్తుల్లో వెలువడింది
"a lo Lady of the lake"
ఒక రెండేళ్ళలో వెలువడ్డాయి సుదీర్ఘనాటకం, నవల.
1893 లోనే సరోజిని కవితలు కొన్నిటిని
పుస్తకరూపంలో ప్రచురించాడు అఘోర్‌నాథ్.
ఆ తరువాత వెలువడిన సంపుటాలు
"The Golden Threshold" ; "The Bird of Time"
'The Broken wing', 'The Sceptred Flute" 'The Feather of the Dawn'.

కవయిత్రిగానే కాదు వ్యక్తిగానూ
సరోజిని ప్రణయావేశం అంతరాలు లేనిది.
తరుణయవ్వనం లోనే తనకంటె వయసులో పదేళ్ళు

పెద్దవాడైన ముత్యాల గోవిందరాజులు నాయుడిని
ప్రగాఢంగా ప్రేమించింది,
పెళ్ళికి సిద్ధపడ్డాడు డా।। నాయుడు.
అఘోర్‌నాథ్‌కు ఈ వర్ణాంతర భాషాంతర వివాహం
మనస్కరించలేదు.

పర్యవసానం—

పై చదువుల పేరుతో సరోజినిని ఇంగ్లండుకు పంపించడం.
ఇంగ్లండులో ఉన్న ఆ మూడేళ్లూ సరోజినిలో
అలలు అలలుగా కవిత పెల్లుబికింది ;
ప్రకృత్యారాధన రూపంగా ప్రణయనివేదన ధూపంగా.
ఆమె కళ్ళనుంచి నిద్రనూ, ఎదనుంచి ప్రశాంతి ముద్రనూ
వెలివేసిన ప్రణయానుభూతి
ఈ కవితలన్నిటికీ స్పందన శ్రుతి.
'కోకిల' స్వదేశరసాలవాటికి తిరిగివచ్చింది.
అనురాగకాకలికి తండ్రి ఆమోదం లభించింది.
సంఘసంస్కరణరణపండితుడు కందుకూరి వీరేశలింగం
ఆధ్వర్యంలో మద్రాసు నగరంలో బ్రాహ్మసమాజ పద్ధతిలో
గోవిందరాజులుతో సరోజిని వివాహం జరిగింది.
ఆనాటి ఈ వివాహం సంస్కరణ చరిత్రలో ఒక
గణనీయఘట్టం.

సరోజిని తొలిరోజుల్లో వ్రాసిన కవితల్లో షెల్లీకీట్సులు
వెల్లివిరిసేవారు.
పాశ్చాత్యుల పూలూ పక్షులూ అమితంగా అగుపించేవి.
నాటి ప్రముఖాంగ్లకవి 'Edmond gosse' ఇచ్చిన సలహా

మంత్రంలా పనిచేసింది.
తదనంతరకవితల్లో మాతృభారతి సాక్షాత్కరించింది.
హైదరాబాదు నగరం విలక్షణరేఖలతో మూర్తీభవించింది.
సంపెంగలు, దానిమ్మమొగ్గలు, అడవిమల్లెలు, గులాబీలు, గుల్‌మొహర్లు, గోరింటలు, దిరిసెనలు, వేపపూలు గుబాళించాయి.
చిలకలూ, చిట్టెలకలూ, గువ్వలూ, కోకిలలూ, ఉడతలూ,
నాగులూ స్వేచ్ఛందంగా విహరించాయి.
పల్లకీబోయీలు, గాజులవాళ్ళు, జంగమగాయకులు,
చేనేతవాళ్ళు, చేపలవాళ్ళు, పాములవాళ్ళు, ఫకీరులు
కవితావస్తువులుగా రూపుదిద్దుకున్నారు.
అచ్చమైన దేశినుడి ఆంగ్లపదాల పట్టుదుస్తుల్లో
అవతరించింది.
"యా అల్లా యా అల్లా" వంటి మాటలు యథాతథంగా చోటు చేసుకున్నాయి.
"కూ కుహూ కుహు కుహూలు"పంచమంలో శ్రుతిచేసుకున్నాయి.

సరోజిని కవితల్లో అక్షతమైన ప్రణయావేశం ఆత్మాహుతిగా ఆవిష్కృతమైంది.

"తీసుకో నా మేని కండలను
వేసుకో నీ ఇంటి కుక్కలకు
తలపుంటె నానెత్తు చేదుకుని
తడుపుకో నీ తోటమొక్కలకు."

ఈ పంక్తుల్లో ప్రణయమూర్తి పాదాలయెదుట తన గుండెను చెండుగా విసిరేసే సర్వసమర్పణభావన తీవ్రాతితీవ్రంగా ధ్వనిస్తున్నది.
ఈ ఆరాధనాతత్త్వం వెనక ఉన్న ఆత్మ ఒక పరిధికి సీమితం.

కాదు. అది విశ్వాంతరాళం దాటి పరమాత్మతో ఐక్యాన్ని కోరు
కునే అద్వైతదృక్పథం.
పసిడికలలూ పచ్చని ఆశలూ
సరోజిని కవితల కావిళ్ళు మోసిన రవలమూటలు.

ఆంగ్లకాల్పనిక కవితాగంధం
భారతజాతీయ భావానుబంధం
ప్రకృతిసౌందర్య సమదర్శనం
పరమతాత్త్విక పరిచింతనం
అనుభూతి గీసుకున్న భావచిత్రాలు
అక్షరాల పోతపోసుకున్న శతపత్రాలు
ఛందస్సుల సురుచిరమందహాసాలు
సుందరపదబంధాల చంద్రహాసాలు
పరస్పరం పోటీపడి
ఒకటిని మించి ఒకటి పరుగిడి
కదిలిపోతూవుంటాయి శిల్పకల్పనాశిఖరాలవైపు.
కవితావ్రతుల కమనీయ రసధ్యేయ హృదయాలవైపు.
ఆవేశాన్ని రసీకరించుకున్న కవయిత్రిగా
ఆత్మధాత్రిని దాస్యవిముక్తంచేసిన స్వరాజ్యసమరాధినేత్రిగా
తన పలుకే మేలుకొలుపుగా జాతిని నడిపించిన
వక్తృత్వమూర్తిగా
సరోజిని వ్యక్తిత్వం త్రిశూల సంకాశం.
దేని పదును దానిదే.
అందుకే ఆ త్యాగమూర్తిని కవితాస్ఫూర్తిని
గోఖలే గురుహృదయం ఆశీర్వదించింది.
గాంధీజీ అమృతవాణి అభినందించింది.
జవహర్ స్నిగ్ధమతి ఆత్మీయంగా అభివందించింది.

# కృ త జ్ఞ త లు

శ్రీమతి సరోజినీనాయుడు ఆంగ్లకవితల్ని నేను అంతగా చదివినవాణ్ణికాను. ఈ మధ్యే ఎందుకో అనిపించింది అలాతిరగేద్దామని. సరదాగా బోటుషికారుకెళితే తరగలమీద ముత్యాలు తేలినట్లుగా తోచింది-కొన్ని కవితల్ని చూస్తూవుంటే. ముఖ్యంగా 'Indian Weavers' ( ఎందుకునేస్తున్నారు ) చదవగానే మూడు చరణాల్లో వేళాత్రయాన్ని ముడివేసి ఒక జీవనతత్వాన్ని చిత్రించిన సరోజిని ప్రతిభకు ముగ్ధుణ్ణయ్యాను. అనువదించాలని సంకల్పించుకున్నాను. మొట్టమొదట ఎత్తుకున్న శీర్షిక 'ఆరాధన'. అలా అలా అప్పుడప్పుడు అశ్రాంతంగా పూర్తిచేశాను యాభైకవితల్ని.

సరోజిని కవితకు ఆవేశం జీవం. ఆ జీవం ఒక్కొక్క మాటు మిరుమిట్లు గొలిపే పదాల పరదాల మధ్య వ్యక్తావ్యక్తంగా గోచరిస్తుంది. విసురు పుట్టిందా విశేషణాల పరంపరలు తెరలు తెరలుగా దొర్లుతాయి. వక్తృత్వ ప్రధాన

మైన ఆమె ఆంగ్లశైలిని యథాతథంగా అనువదించడం సాధ్యమూకాదు; ఆ స్వాద్యమూకాదు. అయినా ఆమె గీతాత్మను అచ్చమైనమాత్రాచ్ఛందసుల్లో అందించడానికి ప్రయత్నించాను. అనుసృజనమంటే ఇదే. లోగడ ఖలీల్ జిబ్రాన్‌ను తెనిగించ డానికి కూడా ఈ మార్గమే అవలంబించాను. సరోజినికి 'భారత కోకిల' అనే బిరుదుంది. ఆమె యింటిపేరు ముత్యాల వారు. రెంటినీ కలిపితే ఆమె ముత్యాల వారింటి కోకిల. 'ముత్యాల కోకిల' నామకరణం ఈ దృష్టితోనే చేశాను.

ఈ కవితల్ని అనుసృజించడంలో నాకు విశే షంగా సహకరించినవారు మిత్రులు డా॥ ఇరివెంటి కృష్ణ మూర్తిగారు.

ఉస్మానియా విశ్వవిద్యాలయంవారి సరోజినీ నాయుడు శతజయంత్యుత్సవ సంఘం పక్షాన దీన్ని ప్రచు రిస్తే బాగుంటుందని సూచించారు ఆ సంఘం కన్వీనర్ ఆంగ్ల శాఖాధ్యక్షులు ప్రొఫెసర్ వి. ఎ. షహానేగారు.

ముద్రణవ్యయం కోసం మూడువేల రూపాయలు మంజూరు చేసినవారు ఉస్మానియా విశ్వవిద్యాలయం ఉపాధ్య క్షులు ప్రొఫెసర్ జి. రాంరెడ్డిగారు.

వీరికీ, ఈ గ్రంథాన్ని ముచ్చటగా తీర్చిదిద్దిన మిత్రులు శ్రీ యం. ఆర్. బలరామాచార్యగారికీ, అందంగా అచ్చొత్తించిన శివాజీ ప్రెస్ వారికీ కృతజ్ఞులు.

హైదాబాదు
సరోజిని శతజయంతి పర్వదినం
13-2-1979

సి. నారాయణరెడ్డి

# ముత్యాల కోకిలా

పాటగా పుట్టీ
పాటగా పెరిగీ
పయనించినావు ఆ
పాటలో కరిగీ.

నీ గీతి చదివి
నిన్నెదను పొదిగీ
పలికితిని నీ వాణి
తెలుగులా ఎదిగీ.

నీ ప్రతిభ నవ్యం
నీ ప్రతిన భవ్యం
నీ కవిత ముత్యాల
కోకిలా ! శ్రావ్యం

—సి. నారాయణరెడ్డి

# అనుక్రమణిక

## పల్లకీ బోయీలు

మోస్తున్నాము మెల్లగ మోస్తున్నాము
ముదిత ఉన్న పల్లకీని మోస్తున్నాము.

పాటపైరగాలిలోన ఊగెనామె పువ్వులా
ఏటినురగచాలులోన తేలెనామె గువ్వలా
విరబూసిందామె కలలపెదవుల చిరునవ్వులా
మోస్తున్నాము ఆమెను ముచ్చటగా
మోస్తున్నామా ముదితను ముత్యంగా.

మోస్తున్నాము మెత్తగ మోస్తున్నాము
ముదిత ఉన్న పల్లకీని మోస్తున్నాము.

పాటమంచుబిందువులో వాలెనామె చుక్కలా
తరగ అంచుపైన ఆమె మెరిసె వెలుగురేకలా
కురిసెనామె కొత్తపెళ్ళికూతురు కన్నీరులా.
మోస్తున్నాము ఆమెను ముచ్చటగా
మోస్తున్నామా ముదితను ముత్యంగా.

## ఎందుకు నేస్తున్నారు ?

'ఈ ప్రభాతవేళ ఇంత మురిపెంగా
ఈ వలువలు మీరెందుకు నేస్తున్నారు' ?
'నీలిహంస రెక్కలనే తలపించే
నెరవలువలు పసిబిడ్డకు నేస్తున్నాము'.

'ఈ మలిసందెలో ఇంత అందంగా
ఈ వలువలు మీరెందుకు నేస్తున్నారు' ?
'పలువన్నెల నెమిలి కనుల తలపించే
పట్టుచీర కళ్యాణికి నేస్తున్నాము'.

'ఈ చలివెన్నెల్లో ఇంతమౌనంగా
ఏమిటదీ ? మీరేదో నేస్తున్నారు' ?
'వెలిమబ్బుల తెలియీకల తలపించే
వలువ శవాలంకరణకు నేస్తున్నాము.'

(2)

## గా జు ల వా ళ్ళ

గాజులవాళ్ళం మేమండీ
గాజులవాళ్ళం మేము.
మూపున మెరిసే గాజుల మోపులు
మోసుకు వెళుతున్నాము.
ఇవిగివిగో ! ఈ సింగిణి రంగుల
చివురు వెలుగు చక్రాలు;
ముద్దుబిడ్డలకు ముద్దుగుమ్మలకు
మురిపెపు బ్రతుకుల గురుతులు.

కొండపైని పొగమంచులలో
వెండినీలి క్రొమ్మించులలా

తళతళలాడే గాజులివి - క
న్నెల ముంజేతుల మోజులివి.
కొండవాగు దరి అంచున
కొత్త కలలు పులకించగా
పొంగులు వారే మొగ్గలివి
రంగూరంగుల నిగ్గులివి

ఇప్పుడిప్పుడే ఉదయించే
ఎలవన్నియలను చిలికించే
మిసిమి తొణుకు చిగురాకులివి
మిసమిసలాడే రేకులివి.
ఎండకు మెరిసే చేలలాంటివివి
పెండ్లిపడుచుకు ప్రియము గొలుపునివి.
పెండ్లినాటి హోమాగ్ని వంటివివి
పెండ్లిపడుచు తలపువన్నె సిరులివి.
కిలకిలలాడే ఆమె నవ్వులివి
జలజల కురిసే ఆ కన్నీళ్ళివి.

తల్లిగ తనయుల లాలించీ
తన యెద ఊయలలూగించీ
మానినిగా కాపురమును తీర్చి
మగడు తోడుగా వ్రతములొనర్చి
బ్రతుకు బాటలో సగము సాగిన
పడతికి సరిపడు పసిడి గాజులివి.

# గోరింటాకు

గోరింట కొనరెమ్మలోన
'కో'అంది ఒక కోకిలమ్మ.
'కూ కుహూ కుహు కుహూ'.

రారండి ఓ చెలియలారా !
రండి గోరింటాకులేర.
ఉంచండి కడవలను ఆ నీటియందె
తెంచండి ఆకులను పొద్దెక్కుముందె.
బంగారు రోటిలో పసిపచ్చ ఆకులను
నూరరారండీ చేరరారండి.

గోరింట కొనరెమ్మలోన
'కో' అంది ఒక కోకిలమ్మ.
'కూ కుహూ కుహు కుహూ'.

రారండి ఓ చెలియలారా !
రండి గోరింటాకులేర.
వధువు నెన్నుదుటికీ కుంకుమం ఎరుపు
మధురాధరాలకూ తాంబూలమెరుపు
లిల్లీల తలపించు వేళ్ళకూ కాళ్ళకూ
లేతగోరింటాకు ఎరుపే ఎరుపు.

## బ హు మ తి

కోనకు చేనికి ఆమని సిరులు
కొంగకు డేగకు రెక్కల పొగరు
చిరతపులికి తనదర్పం

చిరుగువ్వకు తన వర్ణం.
ప్రభూ ప్రభూ ! మరి నాకో
ప్రణయావేశం.

మునకలేయు చేతికేమొ
ముత్యమ్ములు.
వరుని కనులకేమో తన
వధువు మోము.
కలలుకనే మదికి వయసు
జిలుగు కలలు.
ప్రభూ ప్రభూ ! మరి నాకో
సత్యావేశం.

అర్చకులకు ప్రవక్తలకు
ఆత్మమతానందం.
రాజులకూ పరిజనులకు
రాజకార్య విభవం.
పరాజితులకో ప్రశాంతి
బలయుతులకు ఆశాధృతి.
ప్రభూ ప్రభూ ! మరి నాకో
కవితావేశం.

# బంగారు విరులు

నా దారిలోని బంగారు విరులారా !
అంటారు మిమ్మల్ని అడవిపువ్వులని.
కాని అనుకుంటాను నేను - ఇపుడిప్పుడే
ఇలపైన పడిన చుక్కల తునకలేమొ అని
అప్సరోనిలయాన అపరంజి దివ్వెలని
అమృతరసపరిపూర్ణ హైమకలశమ్ములని.

పరమసుకుమారసుమధురసుమములారా !
మదమత్తమధుమాసపదకింకిణులొ మీరు.
తన కన్నెతనమునే తలపోసి ఒక పెండ్లి
పడుచు చిందిన రుచిర బాష్పకణికలొ మీరు.
తరలిపోయిన స్వప్నతరళాత్మల విధాన
పొడచూపినారు ఈ కడసందెలో మీరు.

ము త్యా ల కో కి ల.

## ఇక సెలవు

సెలవు సీతాకోక చిలకలారా !
వెలుగు చినుకులారా !
ఝుమ్మనే తుమ్మెదల మొయిలులారా !
కమ్మ తెమ్మెరలో ఉసూరనే
కలికి ఆకుల యెలతుఫానులారా !
గగనాంతరాన్వేషణంలోన
ఎగిసెగిసిపోవు వనవిహగమ్ములారా !
గీతమధుమాస సం
గాతసఖులారా !
చిన్నారి పాటలారా !
సెలవు సెలవింక.

# ఆమని ఓ ఆమని!

ఆమని ఓ ఆమని! నీ
అంతరంగ మేమది?
కోయిల స్వరలాస్యమో
గులాబి దరహాసమో
వెన్నెలరెక్కలపై హిమ
బిందు లలితనృత్యమో
కదలాడే తెమ్మెర చెలి
కాని మృదుల నాదమో
విరిసే హర్షదళాలను
వీక్షించే క్రొత్తపెళ్ళి
పడుచు నవాశలో; కన్నె
పడుచు కలికి కలలో.

నీ సమ్మోహక మోదధు
నీగత దివ్యానందం
ప్రభాతనాడులలో సం
స్పందనమును కలిగించును.
సమస్తసుందరతా బీ
జముల మోసులెత్తించును.
ఆక్రమించి స్వర్గాలను
అవని గుండెలోన రసా
నంద మూలరూపాలను
కందళింపగా జేయును.

# హుసేన్ సాగర్

తన మోహదీప్తితో
తరుణభానుడు నిన్ను బులిపించు.
నిగనిగలువోవు నీ
నెమ్మోము సొగసు నాస్వాదించ
సాగిపోయే అపర
సంధ్యా జలధరాలు కమ్ముకొను.
కాని ఏ ఒకరు నీ
లోని శోభలను కనుగొనలేరు.
గాలిచెలికాని కొస
వ్రేలితాకిడితోనె
పులకించు నీలోని రక్తిమను
తళతళలలో దాచుకున్నావు.
అతని కొరకే మెరిసి
యాడు నీ కెరటాలు
స్వచ్ఛసంగీతమును ప్రసరించు.
నావలెనె కట్టువడి
నా వొకే విశ్వాససూత్రాన
ఓ సరోవరమా !
ఓ సజీవ మదాత్మబింబమా !

## వసంతవనులు

విసుగెత్తె నాకు వన్నెల ఇంటికప్పులన్నా
మిసిమిమెత్తని పట్టుపరుపులన్నా
కోరిక జనించె గాలికి కదలు
గుల్మొహరు రాగరంజితగుచ్ఛముల పైన.

విసుగెత్తె నాకు ఉద్వేగాలు ఉత్సవాలన్నా
విరతి యెరుగని యశోగీతులన్నా
కోరిక జనించె జ్వాలికలుగా
కుట్మలించే రేల చెట్లపై కెగియగా.

కూడిరా ప్రియతమా ! నాతో
కోకిలలు పిలుచు విరికోనలకు
శ్రమకు అలసటకు దూరంగా
సంస్తుతులకూ నతులకూ అతీతంగా.

చింతలను చిమ్మి ఏ
కాంతముగ కలలు కందాములే
చింత మాకుల వేప
చెట్ల నీడల్లోన.

మల్లెతీగలకు మన కళ్ళు ముడివేసుకుని
చల్లగా పలికించుదాములే సరికొత్త వేణువులు;
మర్రిచెట్ల మొదళ్ళలో దూరి
గుర్రుపెట్టే సర్పరాజులను మేల్కొలుప.

మలిసందె వాలినప్పుడు నదీతీరాన
కలిసి విహరించుదామా.
పసిడి వన్నెల చిరుతపులులు జలముల గ్రోలు
పద్మాకరాలలో జలకమ్ములాడుదామా.

కుసుమితవసంతాలలోన
మసకవెన్నెలల ఏకాంతాలలోన
పరవశించేములే ఓ ప్రియతమా
ప్రణయముఖరిత మౌనగీతాలలోన.

ప్రవిమలోషస్సులకు అనుచరులమై
రసవిభావరులకు సహవ్రతులమై
రాధికామోహనులమై - ప్రహ
ర్ష పరివృతాంతరులమై.

## లెండి సోదరులార

లెండి సోదరులార
లెండి : ప్రాభాత కాం
తులను వినుతించె ని
ద్దురవిడిన గగనాలు.

శయనించె తెమ్మెర ఉ
షాదేవి ఒడిలోన

రేయెల్ల ఏడ్చి ని
ద్రించు పసిపాపవలె.

రారండి కదలి వా
రసులార రారండి !
అలలదాగిన సంపదల కొల్లగొట్టంగ.
వలలుచేపట్టి పడవలపైన సాగండి.
కదలి కాకుల అరుపు అడుగుజాడలలోన
రండి బిరబిర కదలిపొండి అలసతమాని.
జలరాశి మనతల్లి జలధరుడె సోదరుడు
కేలెత్తి పిలుచు కెరటాలె మననేస్తాలు.
బుగులేల దిగులేల పొద్దుగుంకిన వేళ
జలధిదేవత చేతిచలువ మనకుండగా.
పెనుతుఫానులనైన అణగార్చు ఆ శక్తి
తన గుండెలో దాచుకొనును మన బ్రతుకులను.

తరళమధురమ్ము కొబ్బరిచెట్ల నీడ; మరి
మధురమధురమ్ము ఎలమావి గుబురుల తావి.
మధురమ్ము హృదయరమ్యకలధ్వనులలోన
నిండు వెన్నెలలు స్పందించు సైకతసీమ.
అత్యంతమధురమ్ము అనుగుసోదరులార
అలలచుంబనము నురగల హర్షతాండవము.
నడపండి పడవలను కదలి గుండెలపైన
వాలిన నభమ్ము నీలాల అంచులదాక.

## శి శి ర గీ తి

మలినందె వాలింది మబ్బుపైన; విషాద
హృదయాన ఆనందరేఖవోలె.
ఝంఝానిలం వీచె జలదమ్ములోన; నను
పసిడిఆకుల పెనుతుఫాను వోలె.

గాలి సవ్వడిలోన తేలుతూ నా హృదిని
పిలుచు ఆ పిలుపు ఈలలను చెవియొగ్గి విను.
అలసినది ఒంటరిది అసలె నా మది తాను
కలలు రాలగ; ఇంక నిలువనోపను నేను.

## జంగమ గాయకులు

మారుమ్రోగు కానలలో
మారుమ్రోగు వాడలలో
తంబురాలు మీటుకుంటు

తనివితీర పాడుకుంటు
తిరుగుతాము మేమెపుడూ
తెమ్మెర రమ్మన్నపుడు.

వన్నెతరిగి చెన్నుతరిగి
వనితల చిరునవ్వులొరిగి
ఐరికత్తులు మొండివారి
కిరీటాలు నేలజారి
కొన్ని తీపికతలతో
కొన్ని చేదువెతలతో
మిగిలివున్న పొగచూరిన
నగరాలే మా నెలవులు.

ఏ ఆశలనేరుకోము
ఏ కలలను నాటుకోము.
తిరుగుతాము మేమెపుడూ
తెమ్మెర రమ్మన్నపుడు.
ఏ ప్రేమా మమ్మాపదు
ఏ హాయీ మమ్మాపదు.
తెమ్మెర పిలుపే మా విధి
తీర్చే పిలుపు.

(3)

## 'యా అల్లా యా అల్లా'

తొలిపొద్దు పొడిచింది మొదలు
తోడున్న వెలుగుతుది వరకు
తిరుగుతూ వుంటాము మేము
'యా అల్లా యా అల్లా'.

పుట్టించె విధి మమ్ము స్వేచ్ఛగా;
పట్టించుకోము మేమంతగా
కలిమినీ పెను రాచబలిమినీ
'యా అల్లా యా అల్లా'

ఇల్లు వాకిలి కూడు గుడ్డా
ఎవరిచ్చినా ఇవ్వకున్నా
నిత్య సంతృప్తులం మేము
'యా అల్లా యా అల్లా'.

కాలమో ప్రవహించు గాలి;
భావి ముకుళించిన గులాబి
ఎవడు తుంచునో ఎవరికెరుక
'యా అల్లా యా అల్లా'.

భీతి యెరుగక కలిసి జట్టుగా
స్వాతంత్ర్యమే చేతికర్రగా
నేలనేలల తిరుగుతాము
'యా అల్లా యా అల్లా'.

రాజులను పేదలను ఆపే
రాత్రినే చేరుకొనువరకు
తిరుగుతూ ఉంటాము మేము
'యా అల్లా యా అల్లా'.

## ము స లి ది

ఒంటరిగా వీధిలోన
ఒక ముసలిది
కూర్చున్నది మర్రిచెట్టు
కొమ్మకింద.
అనంతానుభవం కొరకు

అత్యంతోల్లాసంతో
సాగే జీవనలీలా
సంరంభంలో కదిలే
విసురుటడుగు సవ్వడులను
వింటున్నది.

కాచుకుంది పగిలిన ఒక చిప్ప ఆమె
కంపించే చేతిలోన
జాలి తొణికి విసిరే బి
చ్ఛం కోసం.

నడుం వంగి చూపు తొలగి
వడిలిన నిరుపేదైనా
పరిహసించు కాలాన్నే
ప్రతిఘటించు గుండె కలది.

ఎగిరిపడే లోకం కరు
ణించిన కరుణించకున్న
అలసిన గొంతుక తెగించి
ఆలపిస్తు వుంటుంది.

"లా ఇల్లాహ ఇల్లల్లాహ్
లా ఇల్లాహ ఇల్లల్లాహ్
మహమ్మదర్ రసూలల్లాహ్".

మీ దయకై చేయిసాచి
వీధిలోన కూర్చుని వుంటుంది
ఎండైనా వానైనా
ఈదరగాలైనా
ఆకలితో బాధలతో లేమితో
అలా కబుర్లాడుకుంటు
ఆఖరి నిద్దుర కోసం.

తరుణయవ్వనం లోన
తన విభుణ్ని తనయుణ్ని లాలించింది.
పండిన ఈ వయసులోన
పాపం ! ఆ అలసిన కనురెప్పలకు ఒ
కింత శాంతి కూర్చేవా
రెవరూ లేరా భగవాన్ !
జాలిలేని లోకులు దయ
మాలి సాగిపోతున్నా
వెతలను దిగమింగిన ఒక
విశ్వాసమె ఊరడించు ఆమె యెదను.

"లా ఇల్లాహ ఇల్లల్లాహ్
లా ఇల్లాహ ఇల్లల్లాహ్
మహమ్మదర్ రసూలల్లాహ్".

# అతిరేకం

నా కనులు మూయవా ఓ ప్రియా ఓ ప్రియా !
అవి అలసిపోయినవి
ఆనందభరముతో
చురుకైన వెలుతురును
చూడలేనట్టుగా
ఒక చిన్నిముద్దుతో ఓ ప్రియా !
పెదవులకు మౌనం విధించవా !
అవి అలసిపోయినవి
ఆలాపనలతో

నా మనసుకింత చోటీయవా ఓ ప్రియా !
అది కుంగిపోయినది
ఆవేదనలతో
అనురాగభరముతో
వాన దాడికి మ్లాన
మైన విరిసొగసువలె
నా మనసు కింత చోటీయవా ఓ ప్రియా !
నా మోము నీడ పడకుండగా.

# మృత స్వప్నం

ఇన్నాళ్ళకు ననుచేరిన స్వప్నమా !
ఎన్నేళ్ళాయెనో నీవు కనుమోడ్చి
హిమాటవులలో లోతుగ నిను పూడ్చి
ఏల వచ్చితివి ఈ దరి
ఎవరు నిన్ను మేల్కొలిపిరి ?
వెన్నాడితివెందుకు నను ;
మిన్నుల క్రొన్నిలి నురగ
లున్న సాగరాలు దాటి.

వచ్చితివా తెంచివేయ
ద్వారానికి కట్టుకున్న పచ్చతోరణాలను.
చేరితివా అదలించగ
చూరులోన ఒదిగివున్న అడవి పావురాళ్ళను.
ఈ మహోత్సవాన మ్రోగు ప్రేమ మంత్రగానంలో
నీ మూల్గులు కలిపెదవా
ఈ విశుద్ధవసనాలను మృతహస్తాలతో తాకి
నీవు మలినపరచెదవా !

మరలి పొమ్ము స్వప్నమా ! హి
మాటవుల సమాధిలోకి
ఎద పగిలిన పావ నిన్ను
ఎపుడో దాచిన చోటికి.
ఇరులనుండి మేల్కొలిపిరి
ఎవరు నిన్ను ? తిరిగిపొమ్ము.
పంకిలమొనరించకు ఎద
పగుళ్ళ నిలిపిన గుడులను.

# ఒ కే హృ ద యం

కలిసి కట్టుగ ఉద్యమించే
చెలిమితో నీ సేవచేసే
రెండు చేతులమమ్మ మేము
రెండు చేతులము.

మసకచీకటి చీల్చివేసే
ఉషఃకాంతికి బాటవేసే
రెండు అడుగులమమ్మ మేము
రెండు అడుగులము.

కాలకాహళికోల్లసిత జా
గ్రన్మహాధ్వనుల నాలించే
రెండు వీనులమమ్మ మేము
రెండు వీనులము.

విదియజాబిలి కళలనూ పున
రుదితరవి ఆశలను పొందే
రెండు కన్నులమమ్మ మేము
రెండు కన్నులము.

ఒక ఉదార సుదూరగమ్యం చేరగా
ఒకే లక్ష్యం అందరిని ముడివేయగా
ఎన్నడూ విడివడక నిన్నే
ఏక చిత్తంతో స్మరించే
ఒకే హృదయం మాది జననీ !
ఒకే హృదయం.

# అనుకృతులు

ఓ ఆమని ! ఎటుల నన్ను
ఉమ్మలింపజేసెదవో
నీ నీరస విచిత్రకళ
తో నను వంచించెదవో.
ఎక్కడివీ ఎర్రపూలు
ఎక్కడివివి ? నా యెద పా
దున పూచిన గాయాలకు
అనుకరణలు కావా మరి !

ఎవ్వరు సమకూర్చిరి నీ
కీ కవితోద్రేక ఫణితి ?
ఎవరు నేర్పినారో మరి
ఎగిసే నీ గాయకులకు
మోహన సౌందర్యాంచల
ముఖరిత కలరవమ్ములను.
ఇంత అట్టహాసం సెల
యేళ్ళకెవరు నేర్పినారు ?

తారామండలి కింత ఉ
దారకాంతి నెవరిచ్చిరి ?
కొండలకెవరిచ్చిరి వన
కుసుమమ్ముల నును వన్నెలు ?
పలు రంగులతో బంగరు
కళలతో ప్రకాశించే
వన్య విహంగం నీ స్మృతి
వాటికలో ఎగియదేమి ?

నేను కన్న కలలపైన
నీ సృష్టిని మలచుకొన్న
వసంతమా ! నేడు బయట
పడినది నీ లోని గుట్టు.
ఎవరనుకున్నారు నీవు
ఇంతటి విద్రోహివనీ.
నా కృతులను దొంగిలించి
నన్నే కాదందువనీ.

# నీవు రమ్మంటే

ఓ ప్రియా ! నీవు రమ్మంటే
ఉన్నపాటున ఉరికిరానా ?
హరిణమ్ముకన్న ఉరవడిగా
విహగమ్ముకన్న వడివడిగా
నాగస్వరాని కుప్పొంగే
నాగాహి కన్న అలజడిగా
ఆ విహాయసముపైబడినా
నీవు రమ్మంటే నేరానా ?

చేర రమ్మంటె నే రానా
కోరికలకన్న ఉరవడిగా
నిప్పురెక్కలు కట్టుకున్న
మెరుపు పిడుగుల కన్న వడిగా
బ్రతుకు చీకటి అలలు పొరలినా
మృతి నిన్ను నన్ను విడదీసినా
ఏ విధి ఎలా తారసిల్లినా
నీవు రమ్మంటె నే రానా ?

# ఆ కాం క్ష

కలిగించగ నీకు దిటవు
కాచిన నా ఆత్మను అందించనా ?
నా గీతికతో స్వాతం
త్ర్య కృపాణంగా నిన్నే మలచనా ?

మృత్యువు నణగార్చి జయో
న్మేషంతో బ్రతుకును సాధింపగా
నీ నశ్వర దేహంలో
నేను శాశ్వత శ్వాసలు నింపనా ?

ఎవ్వరు కాలూన లేని
ఏ త్యాగాంచిత శిఖరం మిగిలెనో !
నా నిర్మలమైన ప్రేమ
తో నిన్నొక దేవతగా మార్చనా ?

# వసంత మహిమ

బాధాపర్వతముల అట్టడుగున
పాతిపెట్టి నా గుండెను లోతుగ
ఇట్టులంటి 'దయనీయహృదయమా' !
ఏ వసంతముల ఇంద్రజాలములు
నిన్ను తిరిగి మేల్కొలుపగలుగునో
ఎన్ని చైత్ర వనులెంత మెరిసినా
ఎన్ని కోయిలలు ఎంత అరిచినా.

చిగురులెత్తు మోదుగుల మొగ్గలూ
తాళ్ళపైని గిజిగాళ్ళ రెక్కలూ
పువులై విరిసెను రవలై మెరిసెను
పుంస్కోకిలల గళమ్ములు మొరసెను.
ఉలిపిరి మబ్బులు అలలై ఉరికెను.
పాతరలో పడివున్న నా యెడద
పైకిలేచి ఉవ్వెత్తుగ అరచెను
"వసంతమా ఇది వసంతమా" అని.

# గంధర్వ భావనలారా !

లేదు లేదింక లా
లించగాలేను మిము మృదువుగా.
ముడువగాలేను సిగ
ముడులలో మిము తమ్మి విరులుగా.
తరలిపోపొండి గం
ధర్వ భావనలార !
తెలిమబ్బుల యెడారి
తీరాలలోకి.
నిలువలేరిక మీరు
ఎలనగవు వెలుగు మొగములతో.
నిర్జనోదార జీవనవనులలోన
నేనొక్క తలపులారిన గానమూర్తిని.
తరలిపోపొండి గం
ధర్వ భావనలార !
జిలుగైన గాలి నే
తల నెలవులోకి.

# ఆత్మార్పణం

ప్రణయ దేవతా ! నిన్నే
ప్రతిఫలమడుగని తృప్తుడ.
నీవెరుగవు నన్ను ; నీకు
నిత్యసేవనా నిరతుడ.

పరచితి నా కలలు నీకు
పందిరిగా, తివాసిగా ;
శీతోష్ణ వికృతులనుండి
నీ తనువును కాపాడగ.

ఇదుగో ! నా గుండె మారి
నది తానె రజతమురళిగ ;
నీ పిలుపును ఆలించగ
నీ వగపును నిర్జించగ.

నీవెరుగవు నాపూజా
నిరతి ఎంత ఉత్కటమో ?
విడిపించును అది నీ ఊ
పిరిని మృత్యుముఖమునుండి.

# ఆరాధన

తీసుకో నామేని కండలను
వేసుకో నీ యింటి కుక్కలకు.
తలవుంటె నా నెత్తురు చేదుకొని
తడుపుకో నీ తోటమొక్కలకు.

మార్చేయి నా మనసు బూడిదగ
మాడ్చేయి నా కలలు ధూళిగా.
ప్రియతమా ! నేను నీ దాననే
పెంచినా నడిమికే తుంచినా.

కసితీర నా ఆత్మ నొక్కేసి
కాల్చేయి నిప్పులను రాజేసి.
అసలైన నాప్రేమ ఏనాడు
అదరదూ మరి ఎదురు తిరగదు.

ఓప్రియా ! నేను నీ యెదలోనె
ఒదిగివుంటాను సుమలీలగా.
కాకుంటె రగిలిపోతానులే
నీ కొరకు నరకాగ్నికీలగా.

(4)

## అలవోకగా

అడవి పువ్వును చేతపట్టుకున్నావు
అదియేమొ పెదవులకు ఒత్తుకున్నావు
అందాలరేకులను చిదిమివేశావు
అది పువ్వుకాదు - నా హృదయం.

మధుపాత్రికను చేతపట్టుకున్నావు
మృదువుగా పెదవులకు చేర్చుకున్నావు.
అలవోకగా తాగి విసిరివేశావు
అది పాత్రకాదు - నా ఆత్మ.

# వి ధీ !

ఓసి మూర్ఖవిధీ ! ఎందు
కో నన్నెదిరిస్తావు ?
ఈ వృథా ప్రఘర్షణతో
ఎందుకు విసిగిస్తావు ?
భేదించగలేవు నన్ను
భీషణ మాత్సర్యంతో.
చీల్చలేవు నన్ను నక్క
జిత్తుల విద్వేషంతో.
నే చేతులు జోడించను
నీ ఉన్మత్తతకు జడిసి.

కడుపుమంటతో నా కను
గవలో వెలుగొందుతున్న
సామ్రాజ్యం ధ్వంసమొన
ర్చగ తెగింతువేమొ గాని:
రవిదీప్త్యాదులపై తా
రాఖచితాభ్రముపై నా

స్మృతులకున్న ప్రభుతను కిం
చిత్తు దోచగలిగేవా ?
నా నిధిలో ఒదిగె అక్ష
తానంత సువర్ణశోభ.

ఆహరించినా నా శ్రవ
ణైక రాజ్యవైభవమును
తొణకని నా అంతరాత్మ
వినకుండా ఉంటుందా -
మ్రోగే లోయల పరిణయరాగాలను
గత వర్షోత్సవ రసమయకావ్యాలను
ఆందోళిత సమీరాల
అపరాజిత సాగరాల
స్వరియించే గీతికలను
తరగెత్తే రాగిణులను.

నా నోటిని నొక్కి వ్యధిత
మౌనాన్ని విధించినా
నా పెదవులపైని శబ్ద
నాదశక్తి త్రుంచినా
కరువౌనా నా మనసుకు
పరమసహజమైన భాష;
తన కలకంఠములకు గూ
ళ్ళను ధరిత్రి సమకూర్చగ.
నా రసోగ్ర హృదయం గా
న మొనర్చక ఉంటుందా

వసంతఋతు విస్ఫోటిత
దళసహస్ర గళాలెత్తి.

అణతువేమొ నా రక్తం
ఆరాటానికి లోనై.
నిర్బంధింతువో నన్ను
దుర్భరబాధకు లోనై.
వానరెక్క లెక్కి సాగు
నా నిరంతర స్వతంత్ర
చటుల భావమూర్తిని నీ
వెటుల బెదరగొట్టగలవు ?
పవనజవ ప్రత్యర్థిగ
భయమెరుగని సహచరుడుగ
పయనించే జైత్రమతికి
పగ్గమెటుల వేయగలవు ?

నా ఆశాజీవనమును
నా మధురస్వప్నమ్మును
నా రుచిరప్రేమను వం
చన పాలొనరించినా
విశ్వానందమునకు అ
ర్పింతును నా బాష్పభరం.
ఓసి విధీ ! ఎంతటి పే
రాస నీకు ; నా దుర్బల
దుర్దాంత గభీరాత్మను
తొక్కివేయలేవు సుమా !

# జుహూ ఇసుకతిన్నెలపై

ఎంత మగతగ ఒరిగితిని తడి
యిసుక తిన్నెల తరులనీడల.
దేవదారు పరీమళమ్ము లి
దే! స్పృశించెను నురగచేతుల.

కడలి తరగలు నా చెవికి శ్రుతి
కట్టినవి విమలస్వరాలను
వింతగా నా మనసు మాత్రమె
వినెను గిరిమారుతరవాలను.

నత్తగుల్లల నేరుకొంటిని
నాచుతీగల నేరుకొంటిని.
కాని నా హృది పూల లోయల
లోన ఏవో కలలు కన్నది.

కడలి రొమ్మున తరుణశశికళ
పడెను పసిడి గులాబి పోలిక.
కాని నా మది నీ కనులతో
కనెను దూర తుషారగిరులను.

# అ ను బం ధం

ప్రియతమా ! హిమబిందుదర్పణమందు ప్రతిబిం
బించు ఉదయరవిచ్ఛవిని హరి
యించగలిగితే ;

అడవి మల్లెలనుండి మరి దానిమ్మ మొగ్గలనుండి చైత
న్యద్యుతులు కాజేయగలిగితె ;
ఎరుపు వన్నెలు హంసనుండీ
ఎగియు రెక్కలు జలధి పవమానముల నుండీ
వెండి తళుకులు కడలితరగల
నుండి నే విడదీయగలిగితె;
ఉక్తినుండీ అర్థమును; నా
ఉనికినుండీ ఊపిరిని; నయ
నమ్మునుండీ రూపమును ; హృద
యమ్మునుండీ స్పందనను విడదీయగలిగితె ;
ఏమొ యేమో నీ సుమధుర మ
హేంద్రజాలమునుండి నాకు వి
ముక్తి నొసగే ఒక రహస్యా
ద్భుతమునే కనుగొందునేమో ?

ఎంత సర్వోన్నతగభీరా
త్మీయ విజ్ఞానప్రతిభతో
ప్రసరించితివీవు నా జీ
వన మహాసామ్రాజ్యమా !
ఈవెకద నా భావనకు ఇతి
వృత్తమైనా మకుటమైనా.
నా వినోదవిషాదములకూ
జీవఫణితివి నీవె కాదా !
ఇంత అవిభాజ్యానుబంధము
నెట్లు చీల్చును మృత్యువైనా !

# ఆ శ

నా విషాదవాసరాల చుట్టూ
నడయాడెను యశోరాగమాధురి
విరిసే రేకుల తుఫానులాగా
మెరిసే ముత్యాల వానలాగా
ముఖరిత వీణాతంత్రులలోన
ముగ్ధకన్యకల మోవులపైన.

నా విషాదవిభావరుల చుట్టూ
నడయాడెను దీపికా మహోత్సవం.
నా జీవితబృందనృత్యకేళిలో
నవనవలాడే ప్రమోదహేలలో
డీలువడిన నా గుండియ జారిపోయె
మేలి ముసుగు కప్పుకున్న భూతంలా.

ఇన్నియేళ్ళ ఏకాంతం వెనకాల
ఇంక మిగిలె బాష్పాలయమే ప్రియా !
నా విషణ్ణహృదయం కనుమోడ్చునేమొ
ఆ విషాదగర్భగృహాంతరంలోన.
అది చేరునా నీ చల్లని ఒడిలోన
అతిగాఢ సుషుప్తి తరంగంపైన.

# గులాబీల వేళ

గులాబీలవేళ యిదే చెలికాడా !
ఎలాయెలా వికసించెనొ మిసిమి చిలుకు
చేలలోన ; ఉద్యానవనాలలోన.
ఎరుపు మెరుపుజల్లులతో
ఎలాయెలా ముంచేసెనొ
సమాధులను మందిరశిఖరాలనూ ;
స్వచ్ఛంద సువర్ణతరంగాలనూ.

తమ విముగ్ధ సౌరభాల
సుమధుర ప్రమోదశ్రీ
లివిగో కొల్లగొట్టండని
ఎలాయెలా కవ్వించెనో భ్రమరాలను.
నీ కలికి తురాయిలోని
నిగ్గులతో పోటీపడు
లలిత కాంతివిభవంతో
ఎలాయెలా బులిపించెనో భ్రమరాలను

ఉప్పొంగు ప్రభాతనదుల
ఒడిని పద్మరాగమ్ములు
పొదిగి ఎలాయెలా గాలి
పొరలను దూసుకుపోవునో.
వెన్నెల కురిసిన పచ్చిక
తిన్నియలను తమ సింగిణి
వన్నెలతో ఎలాయెలా
వధూరాజ్ఞి విరిపానుపు
వలె వింతగ కైసేయునో ?

గుబాళించు వనులనుండి కొని తెచ్చిన
గులాబీల గుడిలో నను దాచండి
గులాబీల మధువున నను ముంచండి
గులాబీల చితిపై నను చేర్చండి
గులాబీల చిచ్చున నను కాల్చండి
వలపు గులాబిని మకుటం
వలె నా తలనుంచండి.

# కో వె ల

అర్చకుడు :

ప్రణయోజ్వల స్తుతికి
అనువైన వేళ యిది మేలుకో.
తెమ్ము తలిరాకులను తెమ్ము నివ్వరిపనలు
తెమ్ము దిరిసెనపూలరెమ్మలను తెమ్ము దా
నిమ్మ మొగ్గలను.

యాత్రికుడు :

అర్చకా ! తెచ్చినా
నయ్య విరిగిన వీణమాత్రమే
ప్రణయ స్త్వార్పణంగా.

అర్చకుడు :

అదె చూడు బలిసమయ
మాసన్నమై పోయె
ప్రణయబలివేదికలపైన అర్పించు రా
సులుగ హరిణకపోతముల మాంసఖండాలు.

యాత్రికుడు :

అర్చకా తెచ్చినా
నయ్య పగిలిన గుండె మాత్రమే
ప్రణయ రక్తార్పణంగా.

అర్చకుడు :

ప్రణయసంప్రార్థనా పరిపూతఘంటికా
ప్రణవనాదమ్మదే వినిపించె
రగులుకొల్పుము సురభిళప్రసూనాలతో
ధగధగా వెలుగు కోవెలను.
రగిలించు ఆ సుమధురజ్వాల మరికొంత
కమ్మని పెరుగుతో సుగంధద్రవ్యాలతో.

యాత్రికుడు :

అర్చకా తెచ్చినా
నయ్య పొగిలిన ఆత్మమాత్రమే
ప్రణయ దహనార్పణంగా.

# ని ష్కృ తి

కొండపైన ఒంటరిగా కునికే ఒక తోటలో
నీలనీల జలధితరంగాల జోలపాటలో
నీడలోని నీడగ పారాడే ఒక విముక్తాత్మ
తిరిగెను పాలిన చేతులు చరుచుకుంటు మూల్గుకుంటు-
ఇదే ఇదే నిష్కృతి నా ప్రణయానికి.

కొండపైన ఒంటరిగా కునికే ఒక తోటలో
రాలిపడిన శైశిరపత్రాల మూగబాటలో
నీడలోని నీడగ పారాడే ఒక విముక్తాత్మ
వగచెను పాలిన రొమ్మును బాదుకుంటు మూల్గుకుంటు-
ఇదే ఇదే నిష్కృతి నా మరణానికి.

# విందు

ఏ చందన పరాగమెందుకోయీ ప్రియా !
ఏరుకోనీ నన్ను ; నీ రాకతోనె నా
నయనాంచలాలపైన శిరోగ్రసీమపై
విరబూసి పురులు విప్పిన ధూళిరేణువుల.

నెలరేని పిలుపులకు తొలిమంచు చినుకులకు
మేలుకొను తెలికలువ పూలేవి తేవద్దు.
నా స్మృతులలోని అలనాటి స్వప్నాలతో
వికలహృది తీయగా విశ్రమించును ప్రియా
నీ అడుగు చిన్నియలు నా యెదద నిలువగా.

కడలులను కలబెట్టి పుడమి కడుపును కొట్టి
ముత్యాల రత్నాల మూటలను తేవద్దు.
ఓ ప్రియా ! ఒక వరముగా ప్రసాదించవా
ఇన్నాళ్ళు నీలోన ఇంకిన విషాదాలు ;
నీ అశ్రువులలోన నిండిన రహస్యాలు.

## కాల విహంగం

ఫలప్రదమ్మైన శాఖ
పై కూర్చొని వినిపింతువు
ఓ కాల విహంగమా !
నీ కలగీతమ్ములలో
బ్రతుకులోని హర్షవైభవాలనా ?

అతినిశితవిషాద సముద్రిక్త ఘర్షణలనా ?
వసంతలయలాలిత ప్రమోదమునా ?
ప్రసవించని భావికి బీజమువేసే ఆశలనా ?
కరిగిపోని ప్రభాతాల
కలలుగనే విశ్వాసమ్ములనా ?
సుమచిర సంధ్యాశ్వాసల
సురభిళప్రశాంతినా ?
మరణమ్మని భావించే
మర్మనిబిడనిశ్శబ్దమునా ?

ఓ కాలవిహంగమా !
నీ కలగానమ్ములోని
ఇన్ని భిన్నగతులను నీ
వెచట నేర్చుకున్నావో ?
ఊగే కానలలోనా ?
ఉప్పొంగు అలలపైనా ?
కొత్త పెళ్ళిపడుచుల తళు
కొత్తే నవ్వులలోనా ?
అపుడే చిగురులు తొడిగిన
ఆమని పట్టులలోనా ?
మాతృమూర్తి సమర్చనా
గీతోషస్సులలోనా
కుమిలిన గుండెలను పొదుగు
కున్న విభావరిలోనా ?
నిట్టూరుపులోనా పగనిండిన సొదలోనా ?
విధినే నిర్జించు ఆత్మవిశ్వాసంలోనా ?

(5)

# అసూర్యంపశ్య

ఆమె బ్రతుకు ఏకాంతంలోన నలిగి
అలసి సొలసి చంక్రమించు తీయనికల.
ఆమె నగలు మలి సందెలలోన కదలి
అంచులపై తళతళ మెరిసే సెగలు.
ఆమె వలువ ప్రభాత హిమ
యవనిక ; మరకత స్వర్ణచయనిక.
వేటాడు మకిలికన్నుల బారినుండి
వేగిపోవు సూర్యుని కిరణాలనుండి
తూగిపోవు తెమ్మెర సరసాలనుండి
ఆమె తప్త జీవనం ని
రంతర పరిరక్షితం గ
వాఞ్ఛాల తెరలమాటున.
మకుటశిఖా సమలంకృత
మణుల వోలె ;
ప్రియుని గుండెలో దాగిన
ప్రేమ రహస్యాలవోలె ;
ఏ అధర్మ హస్తమ్ము తె
గించలేదు ; ఆవిడ అం
దాల రహస్యాలపైని
మేలిముసుగు తొలగించగ.
అజ్ఞాతంగా కాలం
ఆ ముసుగును తొలగించును
దుఃఖమామె ముఖంలోన
తొంగిచూడగా.
కాలగతిని అరికట్టేవారెవరు ?
కలికి అశ్రువులు తుడిచేవారెవరు?

ముత్యాల కోకిల

# మే లు కో మా త ల్లి !

మేలుకో మా తల్లి మేలుకోవమ్మా
నిను కొలువనున్నారు అనుగుబిడ్డలు నేడు
నీ ముందు మోకరిల్లీ.
ఎరుపెక్కె రేయి రేపటి కలలతో
ఏల నిదురింతువు వెతల వలలతో.
బిగిసిన విషాదాన్ని ఛేదించవమ్మా
పిడికిలెత్తి జయాన్ని సాధించవమ్మా.

మేమెవరిమో యమ్మ !
నీ మహాత్మకు వారసులముకామా ?
నిను విడక తడబడక నిలువలేమా ?
హృదయా లివే నిన్ను కాపాడు
సదనాలు, కవచాలు, బలివితర్దికలు కావా ?
నీ యశోగాధ వినిపించి స్పం
దింపజేసెదము తారాధ్వముల.
నిను నిలిపెదము చూడుమో తల్లి
ఎనలేని వైభవశిరోగ్రముల.

హిందువులు :

ఇవిగొ మా పూజాసుమాలు నిన్నభిషేకమొనరించగా.

మహమ్మదీయులు :

ఇదిగొ మా ప్రేమఖడ్గం నిన్నురక్షించగా.

క్రైస్తవులు :

ఇదిగొ మా విశ్వాసగీతి నినుకీర్తించగా.

అన్ని మతాలవారు :

భయరహితమైన మా
భక్తి నీ సేవకొరకే.
వినుము ఓ జనని ! మా
పిలుపు నీ ప్రణతికొరకే.

# లోకమాన్య తిలక్

నీ విపుల వైభవము నో విజేతా ! ఎటుల
స్మరియించగలుగునో మా నశ్వరప్రేమ.

నిలిచె నెదురొడ్డి నీ నిశ్చల నిబిడకీర్తి
దుర్గమ మహానగోత్తుంగశిఖరమ్ములను.

వెలిగించు నీ సముజ్వల శాశ్వతక్రియా
శీలమ్ము మా నేల నేలెడు తమస్సులను.

వెలిగించు నీ జ్ఞానవిక్రమ కళాద్యుతులు
శోకరూపమును విధిరేఖలను సరిదిద్ది.

జాతికే స్వేచ్ఛాపునీతగాయత్రి నే
ర్పిన వీరసైనికా ! ఋషివరా ! జోహారు.

పటు విమోచనశిఖల ప్రజ్వరిల్లెడు నీ చి
తాభస్మమౌను మా తరమునకు వరముగా.

జపియించు నీ అమృత జైత్రశుభనామమును
సకలసాగర లయాత్మక తరంగశ్రుతులు.

## నిత్యశాంతికి నతులు

కొందరందురు లోకమంతా
కూడలి భయద్వేషముల కని ;
విధిలపిత్రం దాడికోసం
వేచె పండిన బ్రతుకు చేలని.

కాని మనసా ! జన్మమెత్తిన
కరణి నే పులకించిపోదును ;
రాశిపోసిన ధాన్యమున అప
రంజి పక్షుల చూసినప్పుడు.

వెండిరెక్కలనెత్తి సంధ్యా
వేళ గూళ్ళకు సాగెడి కపో
తాల నెరిగిన నేను లోక సు
ఖాల నెన్నడు లెక్కపెట్టను.

ఆర్ద్రమౌనమె వరముగా సం
ధ్యానికేతనమందు వన్నెల
కలల తేలెడు నేను ఈ లో
క భ్రమణమును లెక్కపెట్టను.

లెక్కపెట్టను ; విలయసూచన
లెన్నివున్నా లెక్కపెట్టను
జలదరింపగజేయు మౌనవి
షాద రీతిని ; మృత్యుభీతిని.

ఓ రసానందాతిశయ వి
స్ఫార చిరమాధ్వీకమా !
నిన్నులోగొని నా మనసు స్పం
దించి తూగాడెను సుమా !

# వేదనాత్రయి

ఏ రీతి నిన్ను గణి
యింతునో అకళంకశోకమా !
బాధలను నా ప్రేమ
నాదమయ మొనరించగా ;
నా హృదిని అమరవీ
ణగ మార్చగా.

ఏ రీతి నిన్ను లా
లింతునో అతుల సంత్రాసమా !
తాడితమ్మగు మాతృ
ధాత్రి పరిరక్షణకు
కంపించు నా కరము నిన్నమర
ఖడ్గముగ మలచగా.

మరి నీవొ - భయద సుం
దర తిక్తసుమధుర విషాదమా !
మలచుకొందు అగాధ
మరణవేదనతోనె నిన్నాక అ
మరమందిరముగా.

# గోఖలే

ఓ సుధీరహృదయమా !
ఓసరిల్లె ఇన్నాళ్ళుగ
ఉద్గమించు మా ఆశలు.
అవసరమా నీకిక శ్ర
ద్ధాంజలులూ సంస్తుతులూ.

కాపాడగ వ్యధిత మాతృధాత్రిని ; నీ
కరము నుండి జారిపడిన
కాగడాను చేకొని నీ
చితి చుట్టూ నిలిచివున్న
నితాంత సంతాపతప్తులైన జనులు
తమ ఆత్మల నీ చితా న
లముతో వెలిగించనీ.

నీవు ప్రబోధించిన అను
నిత్యప్రార్థనలతోనె
దేశమాతృసమైక్యమం
దిరమును నిర్మించనీ.

# పుష్పితాశోకం

అందాల జవరాలి చరణమ్ము
అలనల్లన స్పృశించు తరుణమ్ము
విరిసికొనును అశోక తరువెల్ల
విరులెన్నొ గుత్తులుగ విలసిల్ల
పాన్పుపై కలయజల్లుటకో - పెళ్ళి
పందిరి నలంకరించుటకో.

నవనవలువోవు నీ చరణమ్ము
నా యెడదపైనిడిన తరుణమ్ము
ఓ ప్రియా ! నా కలలు మేల్కొనును
ఊహలే పాటలై ఝుమ్మనును
పరిశోమన్మత్తదళములుగా - తాము
పరవశింపగజేయు లోకమును.

## నీ వే మ ర ణి స్తే

నీవే మరణిస్తే మరి
నేనో విలపించలేను.
ఎంత మధురముగా వి|శ
మించునొ నా విషణ్ణహృది

కలలెరుగని నిద్దుర కౌ
గిలిలో ; నీ గుండెపైని
దండలలో ఒదిగి ఒదిగి -
నిండు ముదముతో చివరికి
నీవే మరణిస్తే మరి.

జీవితమే పెనుమంటలు
చెరిగే ఓక మేలిముసుగు.
అది మన యిరువురి పరిత
ప్తాత్మల విడదీయు ప్రియా !
జడవిధి ఒక కుడ్యం ; ఆ
శలు దానిని అందలేవు.
అహంకారమొక ఖడ్గం
అది చీల్చును ప్రేమికులను.
అనురాగమ్మొక సంక్షుభి
తాంభోనిధి మన మధ్యన.

నీవే మరణిస్తే మరి
నేనో విలపించలేను.
ఎంత తీయగా మన యెద
లేకమౌను చీలిపోని
మసకనిదురలోన - మృత్యు
మౌనరజనిలో ముడివడి :
కోపమెగిరిపోగా పరి
తాపం గతియించె తుదకు.

## గోలకొండ రాచగోరీలు

మీ ధూళిని తమ చీకటి
మెలకువతో కాపాడే
ఈ నీరవ మందిరాల
లో నేను కలలుగందును.
గుట్టుగ మీ పురాయుద్ధ
ఘట్టాలను తమ గుండెల
దాచుకున్న తెలిబయళ్ళు
నా చుట్టూ నిదురించెను.
రొదచేసే గాలి అలల
లోన మిణుకుమిణుకుమనే
మీ యీటెల సవ్వడులను
మీ రమణుల నవ్వులనూ

కలలుగనే నా మది విన
గా క్షణమాగేను నేను.

మీ కోట శిథిలవిభుతను
ఆ కొండ కిరీటంగా
ధరియించగ ; విధియేమొ వృ
ధాగా మీ శ్రుతకీర్తిని
విస్మృతకేళికి బలి కా
వించనెంచె నృపులారా !
శతాబ్దాలు గతించినా
మృతియెరుగవు మీ నెలవులు ;
మీ వంశానుస్మృతులూ
మీ పరిపాలన కథలూ.

ముదిసిన విధి వృధాగ మీ
పూలను ఏలిన తనువుల
గోరీలకు అప్పగించె
నో రాజ్ఞీమణులారా !
వాడిపోని మీ మృదులా
వణ్యానికి జీవనిహిత
మైన బీజమే మృత్యువు ;
ఔను సుమా ఇది సత్యము.
ప్రతి వసంతకోకిల మీ
ప్రణయగీతులను పాడును.
దానిమ్మల లేపగ మీ
తరుణిమ నిద్దుర వీడును.

## విసుగ్రాతిపాట

"ఎందుకని అరిచేవు ఓసి చిట్టెలుకా !
అందాల చుక్కల్లు చిరునవ్వులొలుక."

"ఏమందు నా రాజు ఇక నాకు లేడు
ఈ బాధ తొలగించు నాథుడింకెవడు ?
చిటిజొన్న లాశించి చేరె నా రాజు

సిరులున్న పెద్దరైతు పంటలోగిలికి.
వలపన్ని అతగాణ్ణి పట్టుకున్నారు
పట్టుకుని అయ్యయ్యో మట్టుపెట్టారు.
ఏమందు నా రాజు ఇకనాకు లేడు."

"ఎందుకని మూల్గేవు ఓ లేడి కూనా !
ఏకాకివై దాగి ఈ కోనలోన."

"ఏ మందు నా రాజు ఇక నాకు లేడు
ఈ మొరను ఆలించు నాథుడింకెవడు ?
పొద్దు గూకేవేళ పోయినాడమ్మా
నీటికోసం తాను ఏటిగట్టునకు.
ఆడపొంచిన వేటకాడేసె అమ్ము
అది చీల్చెనమ్మ మావాడి హృదయమ్ము
ఏమందు నా రాజు ఇక నాకు లేడు."

"ఎందుకని ఏడ్చేవు ఓ పెళ్ళిపడుచా !
ఎల్లలోకం ఆదమరచి నిదురించ ?"

"ఏమందు నా రాజు ఇక నాకు లేడు
ఈ అశ్రువులు తుడుచు నాథుడింకెవడు ?
అల్లాడు కోరికలు తీర్చువారెవరు ?
పెళ్ళిపాన్పు నలంకరించువారెవరు ?
ఏ చిచ్చు నా ప్రియుని చితిని కాల్చిందో
ఆ చిచ్చు నా గుండె రగిలించె నమ్మా.
ఏమందు నా రాజు ఇక నాకు లేడు."

## ర క్ష రే ఖ

స్వీకరించుము ఓ ప్రియతమా
నా కనులనే మణుల పోలిక.
పొదుగుకో ఆ సొగసులను నీ
హృదిని అక్షర రక్షరేఖగ.

(6)

దివ్వెటీలై అవి హరించును
దీప్తకరములతో తమస్సును.
తారలై అవి కాచుచుండు ; సు
తారముగ నీ పసిడి కలలను.

వేకువల సుమశాద్వలాలను
చీకటుల నీలాలచేలను
కోతకోసి రాశిగా నీ
చేత నిడునవి నీవు మురియగ.

స్వేచ్ఛనే అమరాక్షరాలుగ
చెక్కుకొను బరికత్తులౌనవి.
నీ సువర్ణాత్మను పరీక్షకు
నిలుపు అచ్చపు మూసలౌనవి.

కాచు నీ రణశిబిరముల నా
కనులు సందీప్తాగ్నిశిఖలై.
వెలుగునవి నీ ఆలయమ్ముల
మలిగిపోని ప్రదీపశిఖలై.

స్వీకరించుము ఓ ప్రియతమా
నా కనులనే మణుల పోలిక.
పొదుగుకో ఆ సొగసులను నీ
హృదిని అక్షర రక్షరేఖగ

# ఒంటరిపాప

అమ్మవవుతావ నా కందాల చుక్కా !
నడిరేయిలో నేను జడిసి ఏడుస్తుంటె
నాతోనె ఉంటావ నను ముద్దుగొంటావ ?
నా అన్నవవుతావ నవ్వేటి గాలీ !
తోడుగా నిలిచి నాతో ఆడుకుంటావ
కదలి కథలను నింగి కబురులను చెబుతావ ?

ఒక్కొక్క మాటెంత ఒంటరిని ఓ గాలి !
గోడపై పారాడు నీడలకు ; రొదలకూ
నేనెంత వణికిపోతానొ ఓ చుక్కా !
చినిపాపలంటె దేవునికెంతొ ప్రేమంట
నన్ను ప్రేమించి నా చిన్నారి పిలుపులను
ఆలకించేవాణ్ణి ఆ దేవుడంపితే
ఎంత బాగుండేది ఎంత బాగుండేది.

తోడుంది గువ్వలకు తోడుంది పువ్వులకు
తోడుంది తేనెటీగలకూ.
తోడుంది గొర్రెపిల్లలకు గోరింకలకు
తోడుంది చిట్టెలుకలకు బుడుత ఉడుతలకు
తోడుంది జింక పిల్లలకూ.
చీకట్లొ నను గుండె కద్దుకుని
చెవిలోన ముచ్చట్లు చెప్పేటి
అమ్మ నా కెంతొ కావాలనీ
ఆ దేవుడే మరిచె నెందుకని ?

ముత్యాల కోకిల

# జోల పాట

వరిచేలనుంచి కొంతి
మెరచేలనుంచీ
విరిసేటి తామరల
చెరువుల్లనుంచీ
మంచులో తడిసిన
మామంచి కలనూ
తెచ్చాను నీ కొరకు తెచ్చాను.

ముద్దుపాపా ! కళ్లు
మూసుకో హాయిగా.
ఆ వేపగుబురుల్లో
ఆడె మిణుగురులు.
పొదరింట దాగిన
ముత్యాల కలనూ
దోచాను నీ కొరకు దోచాను.

నీలి కన్నుల్లార
వాలి పొండింక.
పసిడి వెలుగుల్లోన
మునిరె చుక్కల్లు.
అద్దేను మీ పైన
ముద్దు మురిపెంగా
చిన్నారికలనూ పొన్నారికలనూ.

## నా గి నీ !

మొగలి పొదలలో ఉడుతలు
మూగ నిదురవోవుచోట
కారడవులు వికచమల్లి
కలతో జిలుగొందుచోట ;

గారడి చేసే నా మురళి
శీరవమును తప్పించుకు
ఎక్కడ ఏ వెన్నెలలో
చిక్కువడిన పరిమళాల
వలల కనుల ఒదిగిన చలు
వలలో దాగున్నావో ?

పోషింతును నిన్ను పాలు
పోసి పుట్టతేనెలిచ్చి.
స్వర్ణాంచితగాత్రులు హ
ర్ష ప్రసూననవదళాలు
గుదిగూర్చే ప్రాసాదని
కుంజమునకు నిను తీసుకు
పోదునో సఖియా ! తుంగ
బుట్టలోన పదిలపరిచి.

ఎక్కడ తిరుగాడుచుంటి
వే ! వెదురుల మూలుగు రొద
లందున ; గన్నేరులు అమృ
తాగ్నులు వెదజల్లుచోట.
నే వలచిన వధూమణీ !
రావే ! ఓ వెండి వన్నె
యెద ఉన్న మధుర కాంక్షా
మృదుల చంద్రికా ! రావే !

# ఆగవే మృత్యువా ! ఆగు.

ఆగవే మృతువా ! ఆగు
అప్పుడే మరణించలేను.
బ్రతుకు మధుమాసమై
పల్లవించనిదే
పరువమే పసిమితో
పరవశించనిదే
ప్రతి కొమ్మలో పికం
పాట పాడనిదే,

ఆగవే మృత్యువా ! అగు.
అప్పుడే మరణించలేను.
చిగురించు ఆశలే
చేతి కందనిదే
ఆనందగీతాలు
ఆలపించనిదే
ఉన్న కన్నీళ్ళన్ని
ఒలకబోయనిదే.
వలపుతో వగపుతో జగతితో
ప్రతినిమిషమూ మారు నింగితో
నా మనసు నిండిపోయేవరకు
నా వాంఛలన్ని తీరే వరకు
నేను మరణించగాలేనులే
నిలువవే మృత్యువా ! నిలువవే.

# అనుబంధం

| | తెలుగు శీర్షిక | | ఆంగ్ల శీర్షిక |
|---|---|---|---|
| 1 | పల్లకీబోయీలు | ... | Palanquin Bearers |
| 2. | ఎందుకు నేస్తున్నారు | ... | Indian Weavers |
| 3. | గాజులవాళ్లు | ... | Bangle Sellers |
| 4. | గోరింటాకు | ... | In Praise of Henna |
| 5. | బహుమతి | ... | Guerdon |
| 6 | బంగారు విరులు | ... | Golden Cassia |
| 7 | ఇక సెలవు | ... | Fairwell |
| 8. | ఆమని ఓ ఆమని ! | ... | Joy of The Springtime |
| 9. | హుసేన్ సాగర్ | ... | Hussain Sagar |
| 10. | వసంతవనులు | ... | Summer woods |
| 11. | లెండి సోదరులార ! | ... | Coromandal Fishers |
| 12. | శిశిరగీతి | ... | Autumn Song |
| 13. | జంగమగాయకులు | ... | Wandering Singers |
| 14. | యా అల్లా ! యా అల్లా ! | ... | Wandering Beggers |
| 15. | ముసలిది | ... | The Old woman |
| 16. | అతిరేకం | ... | Ecstacy |
| 17. | మృతస్వప్నం | ... | My Dead Dream |
| 18. | ఒకే హృదయం | ... | An Anthem of Love |
| 19. | అనుకృతులు | ... | Mimicry |
| 20. | నీవు రమ్మంటే | ... | If you call me |
| 21. | ఆకాంక్ష | ... | The Desire of Love |
| 22. | వసంతమహిమ | ... | The Magic of Spring |